# బ డి పం తు లు

ర చ న :

పెండెం సూర్యనారాయణరావు.

నేటి కాలంలో ఉపాధ్యాయ జీవితాన్ని
యదార్థపరిస్థితుల్లో చిత్రించిన
నాటిక

ప్రకాశకులు :
శ్రీ లక్ష్మీ బుక్ డిపో,
ఏలూరురోడ్డు, —— విజయవాడ - 2.

నిత్య దారిద్ర్యంతో పోరాటంసాగిస్తూ ఆర్థికంగానూ, మానసికంగానూ, సాంఘికంగానూ, సతమతమవుతూ, బడిపంతులు అనుభవించే యాతనలు—సూత్రప్రాయంగా మాత్రం సూచించడమైంది—

చివరఘట్టం – 'బడిపంతులు' జీవితచరిత్రకు – ప్రచార సాధనంగా సాగించబడింది—

భారతవిజ్ఞాన మహాసౌధనిర్మాణానికి మూలపురుషుడైన ఈ బడిపంతులు జీవితం—ఆనందనిలయంకానంతకాలం—దేశంలో జ్ఞానభాస్కరోదయం – సక్రమంగా జరగదేమో !

ఇట్లు

ర చ యి త.

# ఇందలి పాత్రలు

## పు రు ‌షు లు

1. రామయ్యపంతులు (బడిపంతులు) వయస్సుమళ్ళింది. పూర్వాచారపరాయణుడు.
2. సుబ్బారావు (అసిస్టెంటు) పాతికేళ్ల నవనాగరికుడు.
3. చలమయ్య (మరొక బడిపంతులు) ముప్పదేళ్ళు. నాగరికత కలవాడు.
4. బసవన్న (విద్యాశాఖామంత్రి) కద్దరులాల్చీ. దేశనాయకు నిలక్షణాలు.
5. నరసారాయుడు (స్కూళ్ళ యిన్‌స్పెక్టరు) బుష్‌కోటు. పంట్లాము వగైరా.
6. అప్పయ్య (వ్యాపారస్తుడు)
7. కాశీం (ఇనస్పెక్టరు జవాను) ముస్లిం వేషం.
8. అమీనా (కోర్టువుత్తరువులు అమలుజరిపేవుద్యోగి)
9. సాంబశివరావు (12ఏళ్ళు. రామయ్యపంతులు కొడుకు)

## స్త్రీలు

1. ఆదిలక్ష్మమ్మ (రామయ్యపంతులు భార్య. పూర్వాచారము గలది. వయస్సు నలభైవుంటుంది.
2. వెంకమ్మ (బడిపిల్లవాని తల్లి) గయ్యాళిగంప. వితంతువు.
3. పార్వతి (రామయ్యపంతులుకూతురు) 15సంవత్సరాలుంటాయి. చక్కగా చదువుకుంది.

(సమయానుకూలంగా బడిపిల్లలు సభలో కూర్చోడానికి కొందరు పెద్దలు, వెంకమ్మ కొడుకు అవసరం)



మారుపూడి సత్యన్నారాయణ

ప్రొప్రయిటరు :

బొమ్మల బస్తీ పబ్లికేషన్సు
ఏలూరు రోడ్ — విజయవాడ - 2.

ఫోన్ నెం. **921**

అన్నిరకముల లైబ్రరీ పుస్తకములు దొరకును.

# బడి పంతులు

## రంగము

## 1

[ స్థలము: పాఠశాల. రామయ్య పంతులు విచారంతో కుర్చీలో కూర్చొని వుంటాడు ]

రామయ్య పంతులు :-(తనలో) కాలికిబలపంగట్టుకొని, ఇల్లిల్లు తిరిగాను. ఒక్క పిల్లవాడుకూడా బడికి రాలేదు. పొలం పోవాలనివకడు, కడుపునొప్పి అనిమరొకడు. మాఅమ్మ వొద్దన్నదని ఇంకొకడు. ఈ విధంగా వంక బెట్టుకొని, బడి ఎగ్గొట్టుతుంటే యవరికి చదువు వొస్తుంది? పైవాళ్ళవద్ద మామాట ఎలా దక్కుతుంది? పోనీ తరగతికి నలుగురన్నావొస్తే. హాజరుతృప్తి అని అధికారి వ్రాసుకపోతాడుగదా అనుకుంటే వక్కడూ రాడు. (హాజరు పట్టీలు తిరుగ వేస్తుంటాడు) (వెంకమ్మ కొడుకు పన్నెండుఏళ్ళ వాడిని తన్నుకుంటూ తీసుకువొస్తుంది. వాడిచేతిలో చక్కిరాలు మెళ్ళో పుస్తకాల సంచీ వుంటాయి.)

వెంకమ్మ: (కోపంతో) ఏం పంతులూ! మాపిల్లవాడికి వక్క అక్షరం ముక్కయినా రాలేదు. వీడి తోటివాళ్ళంతా ఇంగిలీసు బళ్లోకి పోతున్నారుగాదా! వీడికర్మ కాలిన

ట్టేవుంది. చదువుకోకపోతే అడుక్కుతింటడా వెధవ?
(అంటూ మళ్లారెండు తన్నుతుంది.)

రామ– ఊరుకోవమ్మా! వెంకమ్మ! వాశిసంగతి నేనుకనుక్కుంటాను.

వెంక– కనుక్కుంటావో! అడుక్కుతింటావో? ఎప్పుడూబడి వుండదయ్యో! అన్నీ శలవులే అంటారు. సరకారు సొమ్ము దండగ్గా తింటారయ్యా– మీ పంతుళ్ళు–

రా : నిజమే తల్లీ! మాపంతుళ్ళకు అడుక్కుతినే యోగమే పట్టింది. నీలాంటి వాళ్ళంతా ప్రభుత్వంలోకి వొస్తే రాత్రింబవళ్లూ – అదివారాలూ – బడిపెట్టిస్తారనుకుంటా! అసలు మీ పిల్లవాడు బడికివొచ్చి యెన్నాళ్ళయిందో చెప్పండీ? పిల్లవాడిని క్రమంగాబడికిపంపడం మీరు నేర్చుకోవాలి.

వెం : సరే బాగుంది. పిల్లవాడు ఎక్కడున్నా సరే వెతికిపట్టుకొచ్చి,చదువుచెప్పుకోవాలి. తప్పంతామీపంతుళ్ళదే.

రా : ప్రతివాడిని వెతుక్కుంటూ, తోటలు దొడ్లుతిరుగుతూంటే బడి యేమైపోతుందమ్మా! మీకు పిల్లవాడిమీదకోపం వొస్తే– ఆవేళ బడిజ్ఞాపకంవొస్తుంది. లేకపోతే "ఇవ్వాళ మావాడు రాడండీ"– అనిదీర్ఘాలు తీస్తారు. దేనికైన చస్తామమ్మా! వెంకమ్మా!

వెం : చావండీ. బతకండీ – ఈరోజు మొదలుకొని పీడికి చదువు సరిగ్గా రాకపోయిందా పైవాళ్ళకు తక్షణం రిపోర్టు చేయిస్తా. దాంతో మీ పంతుళ్ళరోగం కుదురుతుంది. సరేనా! అంటూ వెళ్ళిపోతుంది)

చల్లం: అలా అనకండీ! వెనకటి రోజులు కావు. యిది ప్రజా ప్రభుత్వం. మనవాళ్ళే మనల్ని పాలిస్తున్నారు. ప్రయత్నం చేదాం. ఏదో నెలకు రెండో, మూడో జీతంలో ఎక్కువ చెయ్యకపోతారా? లేకుండా అలవెన్సులోనో అంటే కరువు భత్యంలోనో అధికం చెయ్యకపోతారూ చూద్దాం

రా : చేస్తూనే వున్నారు. అనుభవిస్తూనే వున్నాం. అందరికీ జీతాలు పెంచటానికి డబ్బు వుంటుంది. కాని పంతుళ్ళ జీతాలు పెంచడమంటే కుతిక పట్టుకుంటుంది. అసలీ డిపార్టుమెంటే దిక్కు లేని దివాణమైంది.

సుబ్బా: అలా కాదు. మనమంతా పట్టుపట్టితే కొంతయినా ప్రయోజన ముంటుంది.

రా : సరే మీయిష్టం. నేనుమాత్రం వొద్దంటానా? యువకులైన మీరు ఎంతయినా చెయ్యగలరు. కావలసిన ఏర్పాట్లన్నీ చెయ్యండి.

చ : అన్నీ మేమేచూచుకుంటాం. కార్యక్రమాన్ని మాత్రం మీరు నడిపించాలి.

రా : అలాగే. శక్తికొద్దీ సహాయంగా వుంటాను.

సు : చిత్తం, ఇంకాచాలామంది పంతుళ్ళను కలుసుకోవాలి. వస్తాం, శలవు.

(ఇద్దరూ వెళ్లిపోతారు.)

రా:- ఏమి సన్మానాలో ఓరి భగవంతుడా? మట్టిబొమ్మల్ని మానవులుగా రూపొందించే ఉపాధ్యాయులకా ఈ దేబరిగొట్టుతనం. విపరీత కాలం.

(లోపలకు వెళ్ళిపోతాడు. తెర వాలుతుంది)

==

# బ డి పం తు లు

## రంగము

## 2

(స్థలము రామయ్యపంతులుయిల్లు. పంతులుభార్య ఆదిలక్ష్మమ్మ, దూదితో వత్తులు చేస్తూవుంటుంది. కూతురు రుక్మిణి లేసు అల్లుతూవుంటుంది. పేదరికాన్ని తెలపే దుస్తులు వేసుకుంటారు.)

రుక్మి:- అమ్మా! వాళ్ళుఅన్నపూర్ణ, సులోచన అందరూసంగీతం నేర్చు కుంటున్నారట! నేనుకూడా నేర్చుకుంటానే!

ఆది:- మనకూ, వాళ్లకూ, ఏం పోటీ తల్లీ! వాళ్ల కోరికలు చిటికెలో ఫలిస్తాయి. మనసంపాదనయెంత? మనమెంత? అయినా మీనాన్నగారువొచ్చినతర్వాత అడుగమ్మా! ఏమంటారో?

రుక్మి:- అలాగే అడుగుతానమ్మా; నామాట కాదంటారా, మా నాన్నగారు.

ఆది:- బిడ్డల కోర్కెలు అంగీకరించని తల్లిదండ్రులుంటారా? ఈ సంసారంలో పడే యాతనలన్నీ మీ కోసమే కదటమ్మా;

రుక్మి:- నాన్నకూడా వుద్యోగం చేస్తున్నారు కదా? మనకు డబ్బు యెందుకువుండదమ్మా? సుశీలగారినాన్న రోజూ వాళ్ళకు కొత్తబట్టలు కుట్టిస్తూ వుంటాడు. మాకు ఎప్పుడూ చినిగిపోయిన పాత బట్టలే.

ఆది : బడిపంతులు వుద్యోగానికి, జీతంలోనే కోతలుంటాయి. మరోవుద్యోగానికి జీతం మిగులుతుంది. చిన్నపిల్లలకు మీకేం తెలుస్తాయి, వుద్యోగాల్లోని రహస్యాలు?

(కొడుకు సాంబశివరావు ప్రవేశిస్తాడు. చినిగిపోయిన గుడ్డలు ధరించి వుంటాడు.)

సాంబ: అమ్మా! ఇవ్వాళ జీతం కట్టకపోతేనా పేరు కొట్టివేస్తా రట! రేపు మా స్కూల్లో పెద్ద మీటింగు జరుగు తుందట! మంచి గుడ్డలు తొడుక్కురమ్మన్నారు. లేక పోతే పేరుచిట్టిపోతుందని మా మాష్టారుగారు గట్టిగా చెప్పారు.

ఆది: ఇంకా మీ నాన్నగారికి జీతం రాలేదు. బడికి జీతం ఎలా చెల్లిస్తాము రా? పోయిన నెల జీతం తాలూకు అప్పు ఇంకా తీర నేలేదు. గుడ్డలూ, గోచీలూ ఎక్కడ నుండి వస్తాయిరా? పిల్లలకు ఒంటినిండా గుడ్డకూడా కరువయిందిరా భగవంతుడా?

సా: అమ్మా నేను చదువుకొని, పెద్ద వుద్యోగం చేస్తు నమ్మా! అప్పుడు అన్నీ కొందాములే.

ఆది: బాగానేవుంది నీ కోరిక. విఘ్నేశ్వరుడు పెళ్ళికి వెయ్యి విఘ్నాలన్నట్టు నీ చదువుకు ఆటంకాలే వస్తున్నాయి. పెద్ద వుద్యోగానికి కావలసిన చదువు ఎలా చదివించు తాము రా నాయనా!

సాం: కష్టపడి చదువుతానమ్మా!

ఆది: కష్టపడి చదువుతావు. తెలివితేటలున్నాయి. ప్యాసు అవుతావు. డబ్బు ఎక్కడనుంచి పుట్టిస్తాము రా నాయనా!

(రామయ్యపంతులు విసుకుకుంటూ వస్తాడు.)

సాం: నాన్నా! ఇవ్వాళ జీతం కట్టాలి. డబ్బు యివ్వవూ?

రు: నాన్నా! నేనుసంగీతం నేర్చుకోవాలి. సంగీతం మాష్టరు గారితో మాట్లాడునాన్నా!

ఆది ఇందాకటినుంచీ వాళ్ళ గోల పడలేకున్నాను. ఎలాగో సర్దిపంపండి.

రామ: రామరామా! బడిలోకెళ్ళితే పిల్లల గోల. ఇంటికొస్తే వీళ్ళతో చావు. భగవంతుడా! వీళ్ల కోర్కెలు ఎలా నెరవేర్చగలనురా?

ఆది : మరి, సంబంధం సంగతేమైనా ఆలోచించారా! ఎన్నాళ్ళని పిల్లని యింట్లో అట్టిపెట్టుకుంటానండీ! దాన్ని వకయింటిదాన్ని చేసి అవతలికి పంపిస్తే బాగుంటుందీ. తోటివాళ్ళంతా కాపరాలు చేస్తూవుంటే చూస్తున్నాం కదా?

రామ: చూస్తూనేవున్నాం. ఆమాత్రం శ్రద్ధగానేవుంది. ఎరుగున్న వాళ్ళందర్నీ విచారిస్తున్నాను. వాళ్ళకీ, వీళ్ళకీ వుత్తరాలు వ్రాస్తున్నాను. శని అదివారాల్లో గ్రామమంతా గాలిస్తున్నాను. ఎక్కడికి వెళ్ళినా కట్నాల పిశాచం ఎదురొచ్చి, తరిమి కొడుతున్నది. ఈ పెనుభూతం తలవిరబోసుకొని తాండవించినన్నాళ్ళు, మనబోటి పేదవాళ్ళ పిల్లలకు పెళ్ళిళ్ళు కావడం కల్ల.

ఆది : అలా అని వూరుకుంటామా? తలైనా తాకట్టుపెట్టి పది మందిలో పరువునిలుపుకోవాలి గాని?

రామ: అవునవును. దీనితో నిలవడానిక్కూడా నీడలేకుండా పోవాలన్నమాట? అప్పుడు మన ప్రాణాలు హాయిగా ఉంటయ్యి. ఆ వొచ్చే జీతం, పట్టుమని పదిరోజుల క్కూడా చాలదు. అందులో పిల్లల చదువులు,

పెళ్ళిళ్ళు, పురుళ్ళు, పుణ్యాలూ, ఎలానెరవేర్చాలో తోచకుండావుంది.

ఆది : మరేం జేస్తాం. ఇంతకంటె డబ్బుమరెక్కడనుండివూడి పడుతుంది. అలాగే సమకూర్చుకుందాం.

రామ: చెప్పడానికేం? మాటలు ఎన్నైనా చెప్పవచ్చు. తెల్ల వారిలేచింది మొదలు-అప్పు-అప్పు-వకటే అప్పు.

సాం: బడికివేళయింది. జీతంమాటేమంటావు నాన్నా!

రామ: రేపు చెల్లిస్తామని చెప్పరా నాయనా!

రు : సంగీతం మాష్టార్ని పిలిచేదా నాన్నా!

రామ: సంగీతమున్నూ చట్టుబండలూను. నువ్వు సంగీతం నేర్చుకొని, పాటకచ్చేరీలుచేసి, మమ్మల్ని వుద్ధరించ వొద్దులేతల్లీ! మా నెత్తిమీద బరువుదింపుకొని, నిన్ను అత్తవారింటికి పంపిస్తే అదే మాకు పదివేలు.

ఆది : అకాలమైంది. భోజనం చేద్దురులేవండీ?

రామ: పదా! వొడ్డించు!

(అందరూ లోపలికి నడుస్తూవుంటారు తెర వాలుతుంది.)

# బడిపంతులు

## రంగము

## 3

(ఉపాధ్యాయుల మహాసభ, చుట్టూ కుర్చీలు, మధ్య మేజాబల్ల, బల్ల మీద పూలు అమర్చివుంటాయి. సుబ్బారావు, చలమయ్య మరికొందరు పంతుళ్ళు కూర్చునివుంటారు. టేబిల్ ముందు కుర్చీలో విద్యాశాఖామంత్రి ఆసీనులైవుంటారు. రామయ్యపంతులు పూలమాల వేస్తాడు. అందరూ చప్పట్లు కొడతారు.)

రామయ్య: (సన్మాన పత్ర పటం చేతిలో పట్టుకొని చదువుతూ వుంటాడు.) శ్రీ శ్రీ గౌరవనీయులైన విద్యాశాఖా మాత్యులవారి దివ్యపాదపద్మములకు ఈ రేంజి ప్రాథమికోపాధ్యాయ సంఘమువారు సమర్పించుకున్న సన్మాన పత్రము—

ఆర్యా! తమవంటి దేశసేవా దురంధరులు, విద్యావంతులు, యశోవిశాలురు, ఆగర్భశ్రీమంతులు, విద్యాశాఖా మాత్యులగుట మా యొక్క పూర్వపుణ్య సుకృత విశేషమనియే తలంచుచున్నాము. ఈ పేద వుపాధ్యాయుల్ని ఆవరించిన దారిద్ర్యాంధకారమును తొలగించి, తద్వారా విద్యావ్యాప్తిని సక్రమ మార్గమున గావింపగలరని ఆశించుచున్నాము. ప్రస్తుతం మా వుపాధ్యాయులకు యిస్తున్న కరువుభత్యం, జీతం అంతా కలిపి, మా జీవితావసరముల కేమాత్రం సరిపోకుండా వుంది. ఆ యిచ్చే కాస్తజీతమైనా రెండు, మూడు నెలలకు కూడా చేతికి రావడములేదు. ఈ స్వల్ప వేతనముతో

మా సంసారములను పోషించుకొనలేక నానాకష్టములకు
గురి అవుతూ చెయ్యరాని వుపవాసాలు, మోయరాని
నిందలు పడుతున్నాము. ప్రస్తుతం వుపాధ్యాయలోకం
చూడలేక బ్రతికి వున్నదంటే అతిశయోక్తి కానేరదు.
పిల్లలకు చదువు, వుచిత వైద్యము, మాకు అందుబా
టులో లేకుండావున్నవి. ఉచిత వైద్యము ఏర్పాటు
చేసినట్లుగా పత్రికల్లో చూస్తున్నాము. కాని, ఆసుపత్రి
కెళ్ళితే విరా సంతుళ్ళకివ్వమని గవర్నమెంటువారు
మాకు మందూలేమీ పంపలేదని కసరికొడుతున్నారు.
పేరుకుమాత్రం సౌకర్యాలు కాని, ఆచరణలో నిష్ప్ర
యోజనమైనవి. పొట్టనిండా గుడ్డా, కడుపునిండా
తిండి, వుండడానికి యిల్లు రోజురోజుకు కరువైపోతు
న్నవి. తమబోటి విద్యావంతుల్ని తయారుచేసిన దీ
ప్రాథమిక బడిపంతులేకదా! ప్రజాప్రభుత్వం వస్తుంది.
మన బ్రతుకులు బాగుపడునని ఆశించి ఎదురుచూడని
రోజు వక్కటీలేదు. మాకష్టములను కనిపెట్టి, మేమూ
మానవులవలె జీవయాత్ర చేయుగల జీతాలను ప్రసా
దించవలసినదిగా ప్రార్థించుచున్నాము.

( ముగిస్తాడు. అందరూ చప్పట్లు కొడతారు.)

(విద్యాశాఖామంత్రిగారు కళ్ళజోడు సవరించుకొని, పూల దండల్ని తీసి బల్లమీద పెట్టి వుపన్యాసం ప్రారంభిస్తాడు.)

విద్యా:- ఉపాధ్యాయులారా! మీరు చేసిన ఈ సన్మానం
చాల పవిత్రమైనది, అమోఘమైనది. అసలు ఉపా
ధ్యాయవృత్తే పరమపవిత్రము. అట్టి వుపాధ్యాయులచే

జరుపబడిన సన్మానం విలువ చెప్పజాలను. పూర్వజన్మ సుకృతముచేతనే మీరు గురువుగా అవతరించారు. ప్రపంచానికి మీరు చేస్తున్న సేవ అపారం. మట్టి బొమ్మల్ని మానవులుగాతయారుచేసి, మానవత్వాన్ని కల్పిస్తున్నారు. ఈ పవిత్రత్యాగాన్ని చెయ్యగలిగిన మీకు, ఎంతో పుణ్యముంటుంది.

అయితే మీకు యిస్తున్న జీతాలు మీ కుటుంబ పోషణకు చాలక పోవచ్చును. అందుచేత ఈ పవిత్రమైన గురుధర్మాన్ని తృణీకరించవద్దు. కష్టాల కోర్చి మానవసేవచెయ్యగల మీరు ధన్యులు. ప్రభుత్వం చెయ్యగల సహాయం అంతా చేసింది. ఇక చెయ్యడానికి ప్రభుత్వపు బొక్కసంలో డబ్బు నిండుకుంది. ఇచ్చే దానితో తృప్తిచెంది, ఆశలనువిడనాడి, మీబాధ్యతను మీరు నెరవేర్చుకోనండి. అంతేగాని, జీతాలుచాలవని ఆందోళనచేసి, మీ పవిత్ర సాంప్రదాయానికి కళంకం ఆపాదించవద్దు. మానవ సేవయే మాధవ సేవ. ప్రజాసేవచేస్తూ మీకష్టాలను మరచిపోండి. మీకు చాల శ్రమ కలిగించినందులకు నమస్కారములు.

(అని కూర్చుంటాడు.)

సుబ్బా:-(లేచినిలబడి) మన అమాత్యులవారి సలహాలు మనకు అమృతతుల్యంగానూ, కర్ణరసాయనంగానువున్నాయి. తృప్తిపొంది ఈసభ యింతటితో ముగిస్తున్నాము.

(అందరు లేచెదరు— తెరవాలుతుంది)

# బడిపంతులు

## రంగము

## 4

( స్థలము : సుబ్బయ్యశాస్త్రి యిల్లు - సుబ్బయ్యశాస్త్రి పంచాంగం తిరగేస్తూ కుర్చీలో కూర్చొనివుంటాడు. )

సు. శా: ఈరోజులగ్నందివ్యంగావుంది. కన్యాలగ్నం కడురమ్యం. దాంపత్యసౌఖ్యం అనంతం. ఇంతగట్టిగా తరచితరచి లగ్నం నిశ్చయించి, వేళకుసరిగా పుస్తెముడి వేయిస్తేనే నిలవకుండావుడాయిస్తున్నారుకదా! ఆషామాషీగా, అలాసినిమాహాల్లోనో, పార్కుల్లోనోకలుసుకొని, రిజిష్ట్రాఫీసుకెళ్ళి ముద్రవేయించుకున్న పెళ్లిళ్లు చివరదాకా నిలుస్తాయని ఎలానమ్మకం? అయినా యిప్పుడు లగ్నాలు ముహూర్తాలు, ఎవరు చూస్తున్నారు. ఎండాకాలపు శెలవులో, క్రిస్టమసు శెలవులో ముహూర్తాలకు పట్టుకొమ్మలైనాయి. ఆ రెండుశెలవుల్లో వీలు పడకపోతేయిక ఆదివారంశెలవు ఫుండనేవుంది దైవప్రసాదం లాంటిది. ఈ పంచాంగాల ప్రమేయం ఎవడికికావాలి? ఈ కాలంలో చదువుకున్న కుర్రవాళ్లకు, జాతకాలూ ముహూర్తాలూ, అంటే వేళాకోళంగావుంది. దైవజ్ఞులు, సిద్ధాంతులు, వీళ్లకు, గారడీవాళ్లనే అభిప్రాయం కలిగింది. ఈ నాగరికత ముదిరినకొద్దీ, అన్నీ విడ్డూరంగానే కనబడుతున్నాయి. వెనుకఒక పెళ్లిముడిపెట్టా

లంటే, ఏడుజతల చెప్పులు అరిగిపోయేవట! చుట్టాలూ పక్కాలు, పెద్దా, చిన్నా అందరికీ నచ్చితేగానీ, ఆసంబంధం కుదిరేదికాదు. ఇప్పుడో యెవరితోనూ పని లేదు. పిల్లా పిల్లవాడూ, ఎస్. అంటే ఎస్. అంతాబస్.

అగ్నిహోత్రంతో అవసరం తీరిపోయింది. మాబోటి వాళ్లను తల్చుకునేదెవరు? పెళ్లిళ్ళ రయబారాలకు పంపేదెవరు ? కాలంమారింది. కానీడబ్బు గిట్టుపాటు కావడంలేదు. (రామయ్యపంతులు చేతిలోసంచీ. చంకలో గొడుగు తలపాగా. వేషంలో ప్రవేశిస్తాడు.)

రా : శాస్త్రిలుగారు! నమస్కారమండీ.

సు.శా: ఓహో! రామయ్య పంతులుగారూ! నమస్కారం దయచెయ్యండీ.

(రామయ్యపంతులు మరోకుర్చీలో కుర్చుంటాడు.)

రా : శాస్త్రిలుగారూ! నేనురాసినవుత్తరమేమైనా చేరిందా!

సు శా : చేరకేం దివ్యంగా చేరింది. మనకు వుత్తరాలు చేరకపోవడమేమిటండీ! మనపేరు వ్రాసిఎక్కడ పారేసినా వచ్చిచేరుతుంది. రోజూ కట్టలుకట్టలు రానేవస్తాయి

రా:- మన వుత్తరంలోని విషయాలు గ్రహించారా?

సు. శా:- గ్రహించక పోవడమే? ఆలోచనలోనే వుంది.

రా:- చిత్తం. తమ దయవల్ల పనులు త్వరలో నెరవేర్చాలి.

సు. శా:- ఇందులో మా దయేముంది. అన్ని లోపాలు కప్పిపుచ్చటానికి ధనమే ప్రధానసాధనం. ఇదిగో పంతులుగారూ! ఈ రోజుల్లో ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చెయ్యడమంటేఅశ్వమేధయాగంచేసి నంతపని స్తితిపరులయిండ్ల

లోనే అంత క్రతువు జరపవలసివుంటుంది. ఇకమీబోటి
బడిపంతుళ్ళ పిల్లలకు సంబంధాలు కుదర్చాలంటే
సాక్షాత్తు ఆ శ్రీమన్నారాయణుడి తరం గాదు.

రా:- బడిపంతుళ్లు అంత తేలిగ్గా వున్నారండీ?

సు. శా:- తేలికా, బరువూ, తూకం ఎవరిక్కావాలి. లక్ష్మి
ప్రసన్నం కావొద్దటండీ!

రా:- గంతకు తగ్గ బొంత! వొచ్చిన సంబంధంతోనే సరిపెట్టు
కుందాం. పెద్ద పెద్ద వాళ్ళకు యిస్తామని వెళ్ళబో
తున్నామా?

సు. శా:- అలా మీవుద్దేశ్యం స్పష్టపరిచారు కనక వినండి.
మొన్న మీవుత్తరం అందిన తక్షణం ఎకా ఎకి అగ్రి
హారం వెళ్ళాను. అక్కడ మనకు కొద్దిగా బాంధవ్యం
కలిసినవాళ్ళున్నారు. వాళ్ళ పిల్లవాడికి మనఅమ్మాయి
రుక్మిణిని యివ్వించాలని సంకల్పించాను. అన్ని విష
యాలు పిల్లవానితండ్రితోను, వెధవ ఆడబడుచుతోనూ
చెప్పి చక్కా వచ్చాను.

రా:- పిల్లవాని వుద్యోగం—లేక ఆస్తిమీద ఆధారమా?

సు. శా:- ఎనిమిదో తరగతి పబ్లిక్ పరీక్షలో నెగ్గి రెండేళ్లు
ట్రియినింగుపొంది, ఆ వూళ్లోనే గ్రాంటుస్కూల్లో
హెడ్ మాష్టరీ చేస్తున్నాడట!

రా:- మంచిది. అది అలావుంచి మరొకటి విచారిద్దాం.

సు. శా:- ఈ సంబంధాన్ని విచారించేప్పటికే నాతలప్రాణం
తోకకు వచ్చింది. ఇంతకంటే మరొకటి కుదరదంటే
నమ్మండీ? దీనికేమండీ నిక్షేపంలాంటి సంబంధం?

రా:- దానికేం లేదుగానీ, మళ్లా ఈ బడిపంతులే అల్లుడైతే, సన్యాసులిద్దరూ రాచుకున్నట్టే వుంటుందని?

సు. శా:- అవునండీ. మీతాహతుబట్టి ఆలోచించాలి కదా? సుబ్బయ్యశాస్త్రి కుదిర్చిన సంబంధాన్ని వంకబెట్టేవాళ్లు న్నారండీ. బంగారానికి వెలిగారం వేసినట్టే.

రా:- తమ నేర్పరితనం నాకు తెలియక కాదు సుమండీ! ఒకటి రెండూ చూచి అందులో మంచిదాన్నే నిర్ణయించు కుందాం?

సు. శా:- ఆలస్యం అమృతం విషం అన్నారు. కనక తొందర పడితేనే, అదైనా కుదురుతుంది.

రా:- చిత్తం. మాకూ తొందరగానే వుంటిలెండి. ఈ వేసవి శెలవుల్లో ముహూర్తాలున్నాయండీ?

సు. శా. వేసవిశెలవుల్లోనా? మనకు తీరిక వున్నప్పుడే గ్రహ బలంకూడావుంటుందా?అవసరాన్నిబట్టిఅన్నీ ఆలాగేనిశ్చ యిస్తున్నారు లెండి. మరి జరగవలసినరివాజు చెప్పండి.

రా:- ఈ విషయాలలో తమకు తెలియనిదేముంది? మాకు తగ్గట్టుగానే ముట్టచెబుదాం.

సు. శా:- ఆ ముట్టజెప్పటమనే విషయం ముందుగానే వాళ్ల చెవులలో వూదితేగాని దిగిరారయ్యా?

రా:- ఇంతకూ తమరనేది కట్నం మాటే కదూ?

సు. శా:- అవునండీ. అక్కడేవుంది వున్న చిక్కంతా.

రా:- ముందు వాళ్ళ వుద్దేశ్యం తెలుసుకున్నారా?

సు. శా:- ఇదిగో పంతులూ! ఇచ్చేవాళ్ళం మనం. వుచ్చుకు నేదివాళ్ళు. కనకమనమేముందుఇంతఅనిబేరంపెడదాం.

రా:- అదెంతో తమరే శెలవియ్యండి?

సు. శా:- ఆ ముక్కకూడా నా నోటి మీదే చెప్పించడం బాగుండదు. కాలాన్నిబట్టి మనంకూడా మసలుకోడం నేర్చుకోవాలి. మార్కెట్టు రేటునుబట్టి కట్నం ఎంత జోరుగా విసిరితే అంత మోజుగా వుంటుంది. దీనికూడా యీమధ్య బ్లాక్‌మార్కెట్టు పెరిగింది. పబ్లిక్‌గా వేలకు వేలు కట్నాలిస్తే—ఈయనగారికింత డబ్బెలా ఒచ్చిందని, సర్కారు నిలదీసి అడుగుతారని బ్లాక్‌మార్కెట్టులోనే డబ్బు చెల్లింపు జరుగుతూవుంది.

రా:- కట్నాలు యివ్వడం, పుచ్చుకోవడం నేరంక్రింద లెక్కకట్టి వక్కశాసనం చెయ్యకూడదూ సర్కారువారు.

సు. శా:- మంచిమాటన్నావయ్యా పంతులూ! కట్నాల నిషేధాన్ని శాసనం చేస్తే, మాబోటి వాళ్ళంతా లాంతర్లు పుచ్చుకొని, చీకటి బజార్లన్నీ వెతుక్కోవలసిందే.

రా:- అదీ ఒక అనర్థకంగానే పరిణమిస్తుంది!

సు. శా:- ఓఁ లెక్కలేకుండా. దిక్కుదివాణంలేని శాసనాలెన్ని చేస్తే ఏముంది. కంచె చేను మేసేటప్పుడు.

రా:- నిజమేనండీ. శాసనాలు కాగితాలలోనే. ఆచరణలో అవకతవకలు. ఏదిసక్రమంగా అమలుజరుగుతుంది లెండి.

సు. శా:-కాలయాపన అవుతుంది. అసలు విషయం తేల్చండి.

రా:- ఇంకా తేల్చడమేముంది. అయిదు వందలిచ్చి, అన్ని లాంఛనాలు సరిగానే జరుపుకుందాం.

సు.శా: (చిరాకుగా) చవక వ్యవహారమని ముందుగా తెలిసే వుంటే, అసలు యిందులోకి దిగకుండానే వుండేవాణ్ణి. ఈమాత్రం మాటపట్టుకెళ్ళి వాళ్ళతో అనడానికి నాకే సిగ్గు వేస్తున్నది.

రా : కోప్పడకండి. పోనీయింకా కాస్తకలుపుకొని పూర్తి చెయ్యండి.

సు.శా: ఇలాంటి కొసరింపులతో కాదు. వెళ్ళండి.

రా : అయితే ఏమంటారు?

సు.శా: కనీసం నాలుగువేలైనా కట్నంక్రింద అచ్చుకుంటారా?

రా : అంత మొత్తమే!

సు.శా: ఆశ్చర్య మెందుకండీ? మనజనాభా లెక్కల్నిబట్టి ముగ్గురు ఆడవాళ్ళకు వక్క మగవాడని తేలింది. అందువల్లముందుముందు మగపిల్లవాడు దొరకడమేదుర్లభం. కనుక బాగా ఆలోచించి చెప్పండి.

రా : వెయిన్నూటపదార్లకు మించకుండా చూడండి.

సు.శా: (తలగోక్కుంటు) ఆఁ ఇంతగా మీపరి స్థితిని, మీప్రాధేయతను బట్టి ఎలాగో వాళ్ళను వొప్పిస్తానులెండి. మరి నామాట ఏం చెబుతారు?

రా : తగినట్టుగానే సత్కరిస్తాములెండి.

సు.శా: ముభావం పనికి రాదండీ వ్యవహారంలో. కట్టె, కొట్టె, తెచ్చె. అలావుండాలి. కనక ముందుగానే అనేయండి ఆకాస్త.

రా : అన్నమాట చెల్లించుకుంటాం. తమరుణం వుంచుకోవం లెండి.

సు. శా: ఇది సత్యహరిశ్చంద్రుడి కాలంకాదయ్యా! ఎప్పటి కెయ్యది ప్రస్తుతమో। అప్పటికామాటలాడి అన్యుల మనముల్ । నొప్పింపక తానొవ్వక తప్పించుక తిరుగు వాడు ధన్యుడుసుమతీ ॥ అని పిల్లలకు మీరేకదూ బోధి స్తుంటారు. అందుకని మోమోట పడక పచ్చకాగితం మాత్రం పడితీరాలి. ఇదిముడిపడాలి. అర్థమయిందా పంతులుగారు!

రా : అర్థంకాకుండా వ్యర్థమైపోతుందాస్వామి. అలాగేతమ కూ్కడా కోరినంత చెల్లిస్తాం.

సు. శా: మళ్లా వివరాలు చెబుతున్నా వినండి. తర్వాత పేచీలు పనికిరావు. కుర్రవాడికట్నం క్రింద వెయ్యి న్నూట పదార్లు. జరుగవలసిన రివాజు అంతా జరిగితీరాలి. ముహూర్తం నిశ్చయం కాబోయే ముందువంద రూపా యిలు నాహస్తంలోఘల్లున మ్రోగితీరాలి. తెలిసిందా పంతులుగారూ !

రా : చిత్తం. మాట తప్పడం మనసాంప్రదాయంలో లేదండి.

సు. శా: ఆసంగతి నాకు తెలియదా.

రా : మరి పిల్లవాడ్ని చూడ్డం వాళ్ళు పిల్లని చూడ్డం అవన్నీ ఎప్పుడు జరుపుదా మంటారు?

సుశా: వాటి దేముందండీ. అన్నిపనులూ నిముషాల్లో జరిపిం చనటండీ.

రా : సరే; రేపుసాయంత్రం మేమువస్తాం. ఈలోగావాళ్ళకు కబురు చెయ్యండి.

సు. శా: భోజనానంతరం స్వయంగా బైలుదేరి వెళతాలెండి. ఇదిగో పంతులూ! వచ్చేటప్పుడు మాత్రం నా సంభావన సంగతి మర్చిపోకండి.

రా: రామరామా! తనురుణం.

సు. శా: అబ్బే. "ప్రమాదోధీమతామపి" అన్నారు పెద్దలు.

రా: చిత్తం. వెళ్ళివస్తా. శెలవు (నమస్కరించి వెళ్ళిపోతాడు)

సు. శా: ఇలాంటి దౌర్భాగ్యులకు ఆడపిల్లలు పుట్టినంతకాలం నా రొట్టె ఎగిరి నేతిలో పడుతూనే వుంటుంది.

(వెళ్లుతూ వుంటాడు - తెర వాలును)



# బడిపంతులు

## రంగము

## 5

( స్థలము: రామయ్యపంతులు యిల్లు-పకప్రక్కనుంచి రామయ్యపంతులు- మరోప్రక్కనుంచి భార్య ఆదిలక్ష్మమ్మ ప్రవేశిస్తారు. )

ఆది : (తొందరపాటుతో) ఏమండీ ! వెళ్లినపని ఏమయింది? ముహూర్తం నిశ్చయించారా ?

రామ: ఆఁ.అయినట్లే. మామకుతగ్గ అల్లుడు.గ్రాంటుస్కూల్లో హెడ్ మేష్టరీ చేస్తున్నాడు అల్లుడుగారు. నాలుగు వేలకు బేరం పెట్టాడు.

ఆది: అంతడబ్బు పోసినా పిల్లవాడు అందంగలవాడేనా ?

రా : అందానికేం. అన్ని హంగులూవున్నాయి. ఆదాయం మాత్రం గొర్రెతోకలాగుంది.

ఆది : దానికేంలెండి. అమ్మాయి అదృష్టంవల్ల అన్నీ కలిసి రావచ్చు.

రా : అవునవును. అలాఅనుకొని తృప్తిపడవలసిందే.

ఆది : ఇంతకూ ఏం జరిగిందో వివరంగా చెప్పండీ ?

రా : చివరకి ఎలాగో బేరం కుదిరింది. వెయ్యినూటపదార్లు రొక్కం. అన్ని లాంఛనాలు జరుగ వలసిందే !

ఆది : పోనీలెండి కుదిరింది. అంతేచాలు.

రా.- ఆఁ. నా రోగం కుదురుతుంది. అంతా కలిసి రెండు వేలన్నాకావాలి. ఎక్కడినుంచి తెస్తాం. చేతిలో కానీ లేదే! (విచారిస్తూ వుంటాడు.)

(లోపలనుంచి, పంతులుగారూ! రామయ్య పంతులుగారూ! అని కేకలేస్తూ అప్పయ్యశెట్టి వస్తాడు.)

ఆది:- అదుగో! అనుకోకుండానే మన అప్పయ్యశెట్టి వస్తున్నాడు. మనచిట్టితల్లి పెళ్లికి అన్నీకలిసి వస్తున్నాయి.

అప్ప:- అవునమ్మా! రోజులు మంచివైతే మట్టి పట్టుకున్నా బంగారం అవుతుంది. ఏదో ప్రయత్నంలోవున్నట్టుందే?

రా:- ఏముందీ! మన అమ్మాయి వివాహ ప్రయత్నం చేస్తున్నాము.

అప్ప:- ఓ. శుభం. చెయ్యండి. పప్పన్నాలు దండిగా దొరుకుతాయన్నమాట.

ఆది:- నీవూ, నీసాయంలేకుండా జరుగుతుందా? ఈవిషయంలో పూర్తిగా నీవు సహాయం చెయ్యాలి.

అప్ప:- సరి. సరి. నాకే ఎసరు పెట్టారు?

రా:- అప్పయ్యా! జీహ్వకు కమ్మని రుచి కలిగించే కూరపాదులుసైతము ఏదోవక దానినాశ్రయించ వలసిందే కదూ?

అప్ప:- ఏదో తిరకాసుపెట్టి నామెడకేతగిలిస్తున్నారన్నమాట!

రా:- అప్పయ్యా! కంగారుపడబోకు. మావుద్దేశ్యం పూర్తిగా తెలుసుకొని మాట్లాడవయ్యా! నావద్ద చదువుకొని! వ్యాపారం చేస్తూ, గగనానికంటు మేడ కట్టిచావు. కుబేరుడికంటె మించిపోయావు. సిరిసంపత్తులతో తులంతూగుతున్నావు. గ్రామంలో పెత్తనం చేస్తున్నావు. కొంచెం గురుభక్తి చూపించవలసిన సమయంవచ్చింది సుమా!

అప్ప:- రామ రామా! మా యయ్యని సంపు కున్నట్టు. మీా మీాద నాకు భక్తి లేక పోవడమేమిటి? మీా దయ వల్లనే యింత సంపాదించు కున్నాను. మాపెద్దోడ్కి కూడా మీారే అచ్చరం ముక్కలు నేరుపుతున్నారు. రేపో మాపో వాడూ యాపారంలోకి దిగబోతాడు మీారుణంతీర్చుకోవాలంటే మాటలండీపంతులుగారూ

ఆది:- అదే నాయనా? మేమూ కోరేది. శిష్యుడివి. ఆపద సమయంలోఅక్కరకురావడమేనీగురుభక్తికినిదర్శనం.

అప్ప:- కాదన్నానా అమ్మగారూ! కావాల్సిన సాయం సెల విస్తె ఆలోచిద్దాం.

రా!- పెళ్ళి ప్రయత్నంలో వున్నాంకదూ! డబ్బుకావాలి. మా పరిస్థితులు నీకు తెలియకున్నాయా?

అప్ప:-అయ్యో! డబ్బే! సరేకానీయండీ. ఏమాత్రం అంటారు!

రా:- ఎంతోనా! రెండు వేలు.

అప్ప;- (పైకిచూచి, తలగోక్కుంటూ) రెండు వేలే! చాలా భారీగాపోతున్నారు. ఇంకాతగ్గింపువుంటేసెలవియ్యండి.

ఆది : అక్కడికీ క్లుప్తంగా అంచనా వేసుకుంటేనే అది సరి పోతుంది.

అప్ప : అవునండీ అమ్మగారు! మంచంవున్న వరకేకాళ్ళుముడు చుకోవాలి. ఇదిగో చూడండీ. ఇప్పుడు నేను రావడ వెనకటి బాకీతాలూకు ఏదైనా జమ వొస్తుందని. చేబదులుగా తీసుకొన్నదీ, అబ్బాయివడుక్కు తీసుకు న్నదీ, కొట్లో చిల్లరసరకులు బాపతూ, అంతానిల్వ తేల్చాము. వెరశి చిల్లర తక్కువగా అయిదువందలు

దాటింది. మళ్లా రెండు వేలు కావాలంటున్నారు. మరేమీ అభ్యంతరం లేదుగాని, తీరే మార్గం వుందా లేదా అనే సందేహం నన్ను పీడిస్తున్నది. అంతకంటే మరేమీ లేదు.

ఆది : రోజులు మంచివి వస్తే తీర్చక పోతామా అప్పయ్యా?

అప్ప: అన్ని రోజులూ మంచివే అమ్మగారూ! కొత్తరోజులూ పాతరోజులూ వుంటయ్యా? బడిపంతుళ్ళకు అన్ని రోజులు వకటే. బతికినంత కాలమూ యింతే. ఇంతకంటే వందలూ, వేలూ జీతాలు రాబోతున్నాయా? రూపాయికి పదిమానికెలు అమ్మబోతున్నామా? అదీ కాదూ ఇదీ లేదూ! బతికివుండగా బాగుపడడం వొట్టిదితల్లీ!,

రామ: నిజమే నాయనా! యదార్థం చెప్పావు. ఆశ యనేది అలా పీకిస్తుంది. మంచిరోజులువస్తయ్యి అనే తాపత్రయంతో సరిపుచ్చుకొని. కష్టాలుసహిస్తున్నాము. చావకుండా బతక్కుండా వుంది మా జీవితం.

ఆది : ఇంతకు మరి డబ్బు సంగతి ఏం చెబుతావు అప్పయ్యా?

అప్ప: సరేననుకున్నాంకదమ్మా! వక్కటే సందేహం.

రామ: శుభకార్యం చెయ్యబోతూ సందేహాలూ శంకలూ ఎందుకు?

అప్ప: ఆఁ మరేమీ లేదు. మొత్తంమీద కాస్త అటూ యిటుగా మూడు వేలు దాకా అవుతుందిగదా! కాగితం రూపకంగా వుంటే మంచిదని.

రామ : వ్యవహారం ముఖావంగా ఎందుకుండాలె. నోటు వ్రాసి స్తాను.

టిప్ప : నోటుకేంలెండి. దేశంలో అడావుడిగావుంటుందా యె ఈ నోట్లూ, గీట్లూ, ఏగాలికికొట్టుకుపోయినాపోవచ్చు. గట్టిరాత ఏదైనా చేస్తే మంచిది.

రామ :అదికూడానువ్వే చెప్పవయ్యా! మేంకాదంటామా!

అప:- అబ్బే. మరేం లేదు. ఇల్లు తాకట్టుగా వుంటే బాకీ గట్టిగా వుంటుంటుందని, మాఅయ్య బతికుండగా అనే వాడు. ఆపెద్దోళ్ళపద్ధతిమీాద నడుద్దామని నాఆలోచన. సొమ్ముముట్టినతక్షణం మీాయిల్లు మీాకు వున్నదున్నట్లు గా దఖలు పడుతుంది. చేసేపని కాస్తనలుగురికి సమ తంగా వుంటే మంచిది. అంతేగాని తమమీాద నాకు నమ్మకం లేకగాదు పంతులుగారూ?

రామ:-అలాగే కానియ్యి. కానున్నది కాకమానదు,

అప్ప:- అయ్యేదేముంది? అన్నీ సరిగ్గానే జరిగిపోతాయ్. సా యంత్రం అలా బడివదలిన తర్వాత యింటికొస్తే పని పూర్తిచేసి పంపిస్తాను. అన్నట్టు మర్చిపోయాను, నా తెలివి తెల్లార. లగ్నం ఎన్నాళ్లుందండీ?

రా:- ఇంకా వారంరోజులుంది.

ఆది:- నిన్ననే కదూ నిశ్చయం చేసుకుంది.

అప్ప:- అట్లాచెప్పండి. సరే పంతులుగారూ వెళ్లొస్తా. సాయంత్రం మర్చిపోకండి. తప్పకరండి (ముందుకొచ్చి తనలో) ఈబాకీ తీరేదిలేదు.ఇల్లు మళ్ళీదఖలుపర్చేది లేదు. బేరానికి మంచి సెంటరుగావుంది. కొట్టుకట్టిస్తె

వందరూపాయలు పైచిలుకు నెలకు అద్దె వొస్తుంది. రెండో కంటికి తెలవకుండా పనిజరిగించాలి. (అప్పయ్య వెళ్ళిపోతాడు)

రామ: (దిగులుగా తలవొంచుకొని వుంటాడు)

ఆది : ఏమండీ అలావున్నారు! అప్పయ్య గురుభక్తి చూడండి. అడగ్గానే కాదనకుండా డబ్బుయిస్తున్నాడు. మనకష్టానికి అక్కరకొచ్చాడు.

రామ: పిచ్చిదానా! పెద్దపులి, బంగారు కడియం దానం చేసిన కథ జ్ఞాపకానికొస్తున్నదే!

ఆది : కానియ్యండి. కష్టాలు కలకాలం కాపురముంటాయా? మంచిరోజులు రాకపోతాయా?

రామ: ఆం. మంచిరోజులు యింకావొస్తయ్యి. ఇరవై అయిదేళ్ళ సర్వీసుకూడా అయింది. ఏక్షణానో ఆమంచిరోజు వొస్తుంది.

అప్పుచేయరోత హరిహరాదులకైన
మొప్పెతోడ మైత్రి మొదలెరోత
తప్పుసేయరోత తాకట్టుపడరోత

(అని పాడుతుండగా తెరవాలుతుంది.)

# బ డి పం తు లు

## రం గ ము

## 6

[స్థలము : రాజవీధి - స్కూళ్ళ యిన్స్పెక్టరు జవాన్ కాశీం చేతిలో రికార్డు కట్టతో ప్రవేశం)

కాశీం (తనలో) అరే! మాకీఎక్కడిక్కిపోయినాతంటే. ముంద
నడిస్తేతంటా—ఎనక్కినడిస్తే మరీతంటా—సమంగానడి
యింకోతంటా - ఎట్టా చస్తాం సెప్పండీ? మా అయ్య
గార్కి అన్నీ క్యాంపులే. నెలకినాల్గు రోజులైన
కొంపకాడవుండి, పిల్లాజల్లా సూస్కునేగీత లేద్. ఏం
చేస్తాం. మాకీకర్మంయింతే. అసల్ జమాన్ గిరీకోసం
పుట్టాం. అట్లాగేచస్తాం. అనుకోని ఏం లాభం!
ఎనకటి రోజుల్లో బడితనిఖీకిపోతే, భోజనాల్ గీజనాల్
అన్నీ బలేమజాగావుండేయి. ఇప్పుడు వక్కడు పలికేది
లేద్. అసలు మా అయ్యగారు వక్కడే క్యాంపుపో
తున్నాడు. జమాన్ లేదూ, గిమాన్ లేదు. అన్నీ ఆయనే
సూసుకుంటావున్నాడు. మాకీ గొంతు దిగటంలేదు.
జీతం డబ్బులు సాలడంలేదు. ఎట్టా సెయ్యాలా అని?
పండ్గ మామూళ్ళుఅంతాఎగ్గొట్టారు. ఈరోజుల్లోపంతు
ళ్ళుకూడా దుమ్ముకొడుతున్నారు. ఎనకబళ్లోకిపిల్లోడ్ని
పంపిస్తేపప్పూబియ్యం- కూరగాయలు-ఉప్పూ, చింత
పండు నెయ్యీ, తాంబూలందచ్చినసాలాసాలామర్యాద
చేసేవాళ్ళు. ఆ తర్వాతపుస్తకం పట్టిస్తే పంచలసాపు

జల్సానాపుండేది. పండగలువొస్తే, డబ్బులుగల గలారా లేయి. ఇప్పుడు పంతులుఅంటే పలికేదెవరు! అందుకే సదువులుకూడా సన్నగిల్లినాయ్. (ప్రక్కకిచూచి) అరుగో సుబ్బారావుపంతులుగారు వొస్తున్నారు. ఆయన జేబుసూడాలి. (ఇంతలో సుబ్బారావు పంతులువస్తాడు కళ్ళజోడు చేతిలోబెత్తం ఖద్దరుదుస్తులు, రిస్టువాచీ వగైరా)

కాశీం: సలామండీ! సుబ్బారావు పంతులుగారూ! ఎక్కడికో ఏల్తుండారే?

సు :- ఏంకాశీం! ఎక్కడికని అడిగావు?

కా :- పోతుండారు గనక అడిగాను.

సు :- సరే. ఎక్కడకి పోతున్నానో నాకే తెలీదు.

కా :- బాగుంది. బలే చమత్కారమండీ!

సు :- కారంలేదు. గీరంలేదు. ఏమీ తోచకయిలా బైలుదేరాను.

సు :- బడికి పోలేదాఅండీ.

సు :- ఇవ్వాళ బడిఎక్కడిదోయ్!

కా :- మంగళవారం కదండీ!

సు :- నీతలకాయ. మొన్నఆదివారం మిగిలివుంది. ఇవ్వాళ అది కలిసివొచ్చింది. అందుకని యీరోజు శలవు యిచ్చాం.

కా :- అరే! ఆదివారం మిగిలీ మంగళవారంలో కలిసింది. ఎప్పుడు యినలేదే మాకీ!

సు :- మా పంచాంగం .వర్జ్యం. త్యాజ్యం, పూజ్యం. నీకేం తెలుస్తాయోయ్!

కా :- ఇకనించి నేనుకూడా తెలుసుకుంటాలెండి. సరేకానీ, మొన్నదసరామామూలు దయచెయ్యలేదు కదండీ!

సు :- ఆకలిగొన్న కరణం, పాతకవిలి విప్పినట్టు - పండగపోయి మూడునెలలయితే యిప్పుడేంమామూలోయ్? ఏందసరాపండగో!ఎర్రిటిఎండలో పిల్లల్ని వెంటేసుకొని తిరిగితే కానీకూడా రాలేదు. అందుకని తిరగడమే మానేశాం. జీతాలా చాలవు. పండగపబ్బాలకు ఎగగొట్టడం నేర్చుకున్నారు. బ్రతకడంఎలాగో తెలీకుండావుంది.

కా :- ఈ వుద్యోగాలుమానేసి, మరేదన్నా పనిచేద్దాం!

సు :- మనకు పెద్దవుద్యోగాలు చేసేరాతలేదు. ఏదైనా మంచి వ్యాపారంచేస్తే మంచి గిట్టుబాటవుతుంది.

కా :- నాకూ అదే ఆలోచనావుంది. మంచిదాన్ని చూడండి చేద్దాం!

సు :- చెయ్యదల్చుకుంటే ఎన్నోవున్నాయ్.

సీ॥ మనచేత డబ్బున్న మంచి సినిమాహాలు
కట్టించి అద్దె రాబట్టవచ్చు
అప్పుపుట్టినతెచ్చి హైక్లాసు ఫిలుములా
డించి లక్షలు గడించవచ్చు
సరిగసాగక యున్న దొర పొగాకున్నది
లండను కెగుమతి లాభసాటి
అదిలోటు గన్పింప మదరాసు టీనగర్
స్టూడియోలోన భాగస్థుడగుచు

గీ॥ స్టార్, డైరెక్టరై, యాక్టరై, స్టారుతోలగ
మరల బోర్డును తిరగేసి మంచి సెంట
రంమున, ఇడ్లీ. కాఫీలనమ్ము కొనుటో
లేక మిలటరీ హోటలులేవదీసి
భుక్తిగడుపుచు మిక్కిలి భక్తితోడ.
సాయిబాబను గొలుతుము సాయిబన్న॥

కాశీ:- భలే ఆలోచనండీ. అన్నిటికంటే ఆ చివరిదే బాగుం
దండీ. మిల్టిరీ హోటల్. అదే పెట్టాలి.

సు :- దానికేం, ముందు పైసా తీసుకరావోయ్ !

కా :- అదే! అదీలేకనే తంటాగా వుందీ మాకీ.

సు :- ఏమాత్రిం చేతిలో మెల్లావున్నా అసలీ పంతులు పనికి
వొస్తానటోయ్!

కా :- మాకీ జమాన్ గిరీ అసలే చెయ్యం.

సు :- దొందూదొందే, మనకీకోరికలెందుకూ? ఇలాగే యీ
బ్రతుకు తెల్లవార్చుకుందాం!

కా :- అయితే, పంతులుగారూ! జీతంసాలటంలేదు అంటారు
ఈ కళ్ళజోడు, గడియారం , చేతికర్ర, జల్సాగానే వుం
డారుకదా?

సు :- అదా నీ అనుమానం. మన అవతారం సంగతి చెబుతా
విను. ఈ బడిపంతులు పనిలోకి దిగేదెవరో తెలుసా?
మూడోఫారం చదివి, ఆపైన చదువడానికి డబ్బులేని
వాళ్ళు.దరిద్రదేవత ధర్మబిడ్డలైన ఎనిమిదవ తరగతి
డిగ్రీలవాళ్ళు. (స్కూలుఫైనలులో అన్నిదండయాత్రలు
పూర్తిచేసి, సత్తువ వుడికినవాళ్లు.) ఎక్కడా చెల్లని

చిల్లపెంకులూ, ట్రయినింగు స్కూళ్ళల్లో చలామణి అవుతాయి. నేను యీ జాబితాలో రెండో నెంబరు వాడినే. మొదట బడిపంతులుగా తయారయ్యేప్పుడే తీర్మానం చేసుకున్నా. ఈ వచ్చే జీతండబ్బులు వక్కడికి కూడా చాలవు. ఇక పెళ్ళీ, గిళ్ళీ, చేసుకుంటే, ఆ పైన పిల్లాపీచూ, ఏర్పడితే వాళ్లకి కూడూ, గుడ్డా, కొంపా గింపా అన్నీ కావాలి. ఎదుగూ బొదుగూ లేని యీ గొర్రెతోకజీతంతో ఆవన్నీ సర్దుకోలేక నిలువునా చావాల్సివొస్తుంది. లేకపోతే నిత్యమూ ఏకాదశీ వ్రతాలు చెయ్యాలి. కట్టుకున్న భార్యను, కన్నపిల్లల్ని బాధపెట్టిమనం బాధపడడం కంటె, అసలు పెళ్ళిచేసుకోవడమే మానేదామని నిశ్చయించుకున్నా.

శా – మంచిప్లాను వేసుకున్నారు. అయితే యీ వుద్యోగం చేసేవాళ్ళుసన్యాసుల్లాగ వుండాలంటారా?

సు :– అదిగాదోయ్. బ్రహ్మచారిఅంటే, ఏక్ నిరంజన్ అయితే ఈ డబ్బులో ఎలాగో కాలం గడుపుకోవడం తథ్యం.

శా :– భలే. తంటాలేని పనిచేశారండీ. ముగ్గురు పిల్లల్తో – కరువుబత్తెంతో ముప్పై రూపాయిలూవస్తే నాకు ఏం సరిపోతాయ్యండీ? కూటికీ గుడ్డకీ తంటాగా నేవుంది.

సు :– చూస్తున్నాంగదూ ఆ రామయ్య పంతుల్ని. వుప్పురానికూడా గడ్డం గీయించుకోడానికి డబ్బు లేదంటాడు. ఆయనమాదిరే అవుతుందని పెళ్ళిమాటే ఎత్తుకోను.

కా :- నిజమేనండీ. ఈ కాలంలో మరీనైసుగా వుండాలి. లేకపోతే అంతా తంటే.

సు :- అంతేకాదు వినవోయ్ సాయిబూ!

మ॥ కనులన్ గాంచరు ఎవ్వరేనియున్ ఈకాలస్థితిన్ బట్టి, వాసనహారాయిలు, లక్సుసోపు, సినిమాజల్సాలు, గోల్డెన్ సులోచనముల్, చక్కని చేతిబెత్తమును, స్విజ్జర్లాండు రిస్టువాచి, ఫారన్ క్రాపున్ గల ఫ్రెంచి మీసములు,
కారాకిళ్ళియే లేనిచోన్.

తెలిసిందా! దర్జా, డాబుసరిగ్వుంటే అడుగులకుమడుగులొత్తుతారు. లేకుంటే తొత్తులాగాజమకట్టారు. తెలివి గిలివి ఎవడికాక్కావాలోయ్.

కా :- ఉన్నమాటే అనేశారు. సరేగానీ, ఓ బిడీముక్కన్నా యియ్యండీ!

(సుబ్బారావు, కాశీం, చెరోబీడీ కాల్చుకుంటారు.)

సు :- సరేగానీ, మన ఆఫీసు వ్యవహారాలు చెప్పవోయ్!

కా :- అవునండీ మర్చిపోయాను. కొత్త యిన్స్పెక్టరుగారు నిన్నవచ్చి ఛార్జీ తీసుకొన్నార్. తెలిసిందా అండీ. రేపే మీబడికి తనిఖీకిబస్తార్. జాగర్తా ండీ!

సు :- ఆయనమారిపొయ్యాడు. ఈయనవచ్చాడు! ఈయనగారి హయాం ఎలావుంటుందో?

కా :- కొత్తఅయ్యగారి దగ్గర మా మాటంటే భలేచలామణీ అవుతుందిలే. తెలిసిందా అండీ!

సు :- ఆ తెలిసిందోయ్ తెలిసింది.

కా :- ఎప్పుడూ అండి?

సు :- ఇప్పుడే చెప్పావుగా!

కా :- భలేవారండీ. మీతో అంతా తంటాగానేవుంది. రేపు క్యాంపుకువస్తే, మాకీ జర్రాజలహ్సా చెయ్యాలాఅనివుంది.

సు :- ఓ. తప్పకుండా మడతకుడుములు తినిపిస్తాం.

కా : అంతపనేసేస్తారు? కుడుముల్ ఛూత్. మాకీకొంచం కారం తగలాలనీవుందీ సార్.

సు: - కారంకూడా పట్టిస్తాంలే. రండీ. మోకాలులోతు బురదలో మా బడిదగ్గరకు వొచ్చేటప్పటికి తలప్రాణం తోకకొస్తుంది. వారంరోజుల జీతంపెడితే మా నెడు బియ్యం వొస్తున్నాయి. ఉప్పూ. పప్పూ, వల్లకాడు కొన లేకుండావున్నాం. మీకు జల్సా చెయ్యడానికి పంతుళ్ళ దగ్గర అక్షయపాత్రేవుంది కనక. కడుపునిండా తిని మరి క్యాంపుకు రండీ.

కా :- ఏదో మీదయ. సరేగాని, ఎక్కడికీ దయచేస్తున్నారు మాకీ చెప్పకూడదా అండీ.

సు :- ఎక్కడికేముంది. మనరామయ్య పంతులు కూతురు పెళ్ళి జరుగుతూవుంది. దప్పళానికి బైలుదేరిపో తున్నాం.

కా :- అదా. తెల్సిందీ. మాకీవస్తాం. పండ్గమామూలుకూడా యియ్యాలేదు. అన్నీ కలసి వస్తాయి. పదండీ బాబూ పదండి.

సు :- నీ మామూలు తగలెయ్య. జలగల్లాగ వేధిస్తున్నారు. ఎక్కడికి పోయినా మామూలు. మామూలు. లేకుంటే పనికి నామాలు పెడుతున్నారు.

కా :- అంతేగదండీ. ప్రతీవాళ్ళు పైన ఏంవొస్తుందీ అని అడుగుతారు. అది ఆచారం అయిపోయిందిలెండి. మాకీ కూడా మామూలు అయింది.

సు: - నీగోల నీది. అప్పుతెచ్చి పెళ్ళి చేస్తున్నాడు. అది తీరే దిక్కులేక కుమిలి చస్తున్నాడు రామయ్యపంతులు.

కా: - అప్పులో యిదొక అప్పు. తీర్చేదీలేదు. ఇచ్చేదీలేదు. పదండిబాబూ పదండీ. ఆకలవుతూవుండాది. పెళ్ళిధప్పళం. ఆలశ్యం అవుతుందేమో.

సు: - సరేనడూ!

(ఇద్దరూ నడుస్తుంటారు. తెరవాలుతుంది.)

=(०)=

# బడిపంతులు

## రంగము

# 7

(స్థలం : పాఠశాల - ఇన్‌స్పెక్టరు డ్రాయరుముందు కుర్చీలో కూర్చొని రికార్డు తిరగేస్తూ వుంటాడు - రామయ్యపంతులు చేతులు కట్టుకొని నిలబడివుంటాడు - జమాన్ కాశీం ఒక ప్రక్కగా నిలబడి వుంటాడు.)

ఇన్ :- ఏం పంతులూ! రికార్డుఅంతా కొట్టివేతలతో నిండిపోయిందేం? బాలికలపేర్లు ఎర్రసిరాతో వ్రాయాలని తెలీదా యేం?

రా :- చిత్తం, చిత్తం.

ఇన :- రికార్డుషీట్లు అప్‌టూడేట్‌గా వున్నాయా?

రా :- ఇంకా పూర్తికాలేదండీ! అసిస్టెంటు సుబ్బారావుగారు రెండు నెలలు శెలవుపెట్టారు. ఇంకా మూడురోజులలో వచ్చి జాయిన్ అవుతారు. ఆ శెలవు కాలంలో ఎవర్నో తూర్పుకోస్తానుంచి వకర్ని వేశారు. ఆయన గారు వొచ్చి జాయిన్ కాలేదు. మళ్ళా ఇంకో ఆడ పంతులమ్మని వేశారు. ఆమె వక్కరోజువుండి శెలవు పెట్టి వెళ్ళింది. మళ్ళా రానేలేదు. అందువల్ల అన్ని పనులూ నేను వక్కడినే చెయ్యలేక పోతున్నాను.

ఇన:- ఇంకా ఎప్పుడయ్యా! రికార్డులంతా పూర్తిచేసి సిద్ధంగా వుంచమని మెమోకూడా పంపాముకదూ!

రా:- అది నిన్ననే అందింది. తమరు యివ్వాళ దయచేశారు.

ఇన:- అయితేమాత్రం పూర్తిచెయ్యవలసిన బాధ్యత ఎవరిది?

రా:- చిత్తం.

ఇన్:- ఏం చిత్తమయ్యా. నీమోహంచిత్తం. అన్నిటికీ వకటే మంత్రం. వొట్టి తప్పుడు రికార్డుర్న్నా నువ్వూను.ఎలా ప్యాసయ్యావయ్యా ట్రయినింగు!

రా:- చిత్తం. తప్పులే మాత్రంలేవని గట్టిగా చెప్పగలను, అంతా యదార్థంగానేవుంటుంది. తమరు సెలవిచ్చినట్లుగా నా ట్రయినింగునాటికి తమరు జన్మించారో లేదో?

ఇన:- అధికప్రసంగం కట్టిపెట్టి సెలబస్ కాగితాలు, నోట్సు ఆఫ్ లెస్సన్సు చూపించు?

రా:- పాతికేళ్ళ సర్వీసు అయింది. ఇంకా ఏం నోట్సులు రాస్తామండీ? అనుభవం గడించాము. చక్కగా బోధిస్తున్నాము.

ఇన:- అలా అంటే వీలులేదు. చచ్చేవరకూ రాయవలసినదే!

రా:- చిత్తం. అలాగే.

(ఇంతలో జమాన్ కాశీం, రామయ్య పంతుల్ని యివతలకు పిలుస్తాడు.)

కా :- పంతులుగారూ! అయ్యగార్కి, మాకీ భోజనం ఏర్పాటు అయిందా! ఆకలేస్తుంది.

రా:- కొంపలో ఏమున్నదో తెలీదు. ప్రొద్దుటినుంచి నేను యిక్కడే వున్నానుకదా! పిల్లల్ని పంపికనుక్కుంటా.

కా :- ఇంకా కనుక్కోవడంలోనే వుందీఅండీ. పదకొండు అయింది. మాకీ జల్దీ సెయ్యకపోతే మీకీ రాతల్, గీతల్ అన్నీ కోతల్ పెట్టి సున్నాసుట్టిస్తాం. తెలిసిందా అండీ!

(ఇంతలో రామయ్యపంతులు కొడుకు సాంబశివరావు వస్తాడు)

సాం :-నాన్నా! నాన్నా! ఇవ్వాళ బియ్యం నిండుకున్నాయట! ఇంకా అన్నం వండలేదు త్వరలోబియ్యం పంపమన్నది మాఅమ్మ (అని వెళ్లుతాడు)

రామ:-చూశావా కాశీం! ఆకబురుకాస్త రానేవచ్చింది. మీదారి మీరుచూచుకోండి. నాకొంపలో ఏమీలేవట!

కా :- భలేవెత్తువేశాగ్ తండ్రీ కొడుకూ. మాకీతంటా తెచ్చిపెట్టారే?

రామ:-రామ రామా! అబద్ధం చెప్పడానికి మాకేంపట్టిందయ్యా! తిండిలేక మేంచస్తుంటే మీకు పరిహాసాలా

కా :-పోనీ మామూలేదన్నా దయచేస్తారా?

రామ:-మేమేమీ దయ చెయ్యలేం?

ఇన్:- కాశీం ఈ రికార్డు తీసికో? పంతుల్ని ఒకసారి ఆఫీసుకు రమ్మను.

రామ:-చిత్తం.

(ఇన్‌స్పెక్టరు, జమాను వెళ్ళిపోతారు)

రామ:-భగవంతుడా! ఇన్‌స్పెక్టరుఅంటే ఈకాలంలో ప్రసవ వేదనగా మారింది. వొచ్చినదగ్గర్నుంచి, రికార్డుగోల తప్ప—పిల్లలకు చదువు ఎంతచెప్పారో, విద్యలో పిల్లలెంతవరకు అభివృద్ధికి వొచ్చారో, బడికివుండే లోటుపాట్లేమిటో, విచారించే అధికారి ఏడీ! కష్టపడి చెప్పేవాడికి కాలంకాదిది. కాళ్ళుబల్లమీదపెట్టి పడుకునేవాడికే కాలం. కాలాన్నిబట్టి బుద్ధి మార్చుకుంటేనే భుక్తి గడుస్తుంది.

(లేచివెళ్లుతూవుంటాడు- తెరవాలుతుంది.)



# బడిపంతులు

## రంగము

## 8

(స్థలము: అప్పయ్య శెట్టియిల్లు-అప్పయ్య శెట్టి కూచోనిపొగచుట్టలు చుడుతూ వుంటాడు.)

అ :- (తనలో) రోజులు చూస్తుంటే తారు మారుగా వుండయ్యి. రూపాయికి బేడలుకూడా ఒచ్చేట్టులేదు. ఉన్నదికాస్త వూరిమీదచల్లాను. అదిరోల్లుకోవాలంటే దేముడు దిగి వొస్తున్నాడు. అప్పు పెట్టకపోతే వున్నది పెరగదు. అందినవరకు వసూలుచెయ్యకపోతే అవస్త పడవలసి వచ్చేట్టువుంది. ఈ రామయ్యపంతులుయవ్వారం ముందు తేల్చుకోని, ఆనక్కితక్కినోళ్ళ పనిపట్టాలి. డిక్రీకూడా అయింది. అమీనా యివ్వాళవస్తే యిల్లు స్వాధీనం అవుతుంది. అంతగా పేచీపెడితే, అయిదో, పదో, చేతులోపడేస్తే ఆ పంతులే బయటికి నడుస్తాడు. (ప్రక్కనచూచి) అడుగో! అన్నట్టు అమేనాకూడా వొస్తున్నాడు.

(అమీనా ప్రవేశం)

అమీనా: ఓ, అప్పయ్యగారూ! తమ కోసం వూరంతా వెతుక్కుంటూ వస్తున్నాను?

అప్ప: బాగానేవుంది. నేను మిమ్మల్నే వెదుక్కుంటూ రావాలనుకుంటున్నాను. ఆడబో తేతీర్థమెదురైంది.

రంపీకోటిలాభాలు (అమీనావచ్చి ప్రక్కన క్రిందుగా కూర్చుంటాడు)

అమీ: శెట్టిగారూ! డిక్రీఅమలుజరపడానికిఅభ్యంతరమేమైనా వుందా?

అప్ప: ఏమీలేదు. ఆ పంతులు పదిగంటలకల్లా యింటికి వస్తాడు. ఆయన ఎదురుగ్గానే అన్ని పనులూ జరుపుదాం. ఇందులో రహస్యమేముంది గనక. ఆయన సొమ్ము అన్యాయంగా మనకు కావాలంటున్నాం గనకనా? అలాంటి బుద్ధి మనకు అసలేలేదు. ఏమంటారు. అమీనాగారూ?

అమీ: యదార్ధంగా అంతే ఆయనేదైనా పేచీపెడితే?

అప్ప: నాకూ అదే సందేహంగావుంది. డబ్బుచెల్లించడానికి కానీ చేతిలోలేదుగదా! కొంపవొదిలిపోక ఏం జేస్తాడూ?

అమే: ఆయన చేసేదేముంది. సర్కారు ఆర్డరు ప్రకారం మనం నడుద్దాం.

అప్ప: అంతే. ఏదో చనువుసెప్పి కాస్త లెక్కరాసేట్టు చేశాడనే యనకాడుతున్నా, లేకపోతే యీ పని ఎప్పుడో ముగించేవాడ్ని. ఇక తప్పదు.

అమీ: ఎట్లా తప్పుతుంది అప్పయ్యా? అంతాఅయింతర్వాత?

అప్ప: ముమ్మాటికి తప్పదు. ఆ పూరికొంప పీకిపారేసి. మంచి డాబా కొట్లు కట్టించాలి. కలపకూడా సిద్ధంఅయింది. ఈ నెలతప్పితే శూన్యమాసంవొస్తుంది. అందుకని పది రోజుల్లో కొట్లులేవదీస్తాం.

ఆమీ: అంతా డబ్బుతో నేవుంది. తమరు తల్చుకుంటే ఎంతే పనైనా చేస్తారు. పదండి. పది గంటలు దాటింది.

అప్ప: సరే ముందునడవండి.

ఆమీ: ముందు భోజనానికి నడుద్దాం. ఆ పైన పంతులుగారింటికి నడుద్దాం.

అప్ప: దాని దేముంది ఎప్పుడైనా తినేదేగా?

ఆమీ: ఆలాకాదండోయ్! మన పని పూర్తిచేసుకొని, ఆ తర్వాత డిక్రి పని చూద్దాం.

అప్ప: నీ యిష్టం పదా. (తనలో) ఎవర్ని పలికరించినా తిండి తిండీ, వకటే తిండి. నాలుగురోజులైనా తిండిలేకుండా వుండలేరు. గాంధీమహాత్ముడు చూడండీ ఎన్నోరోజులు వుంటాడు. తిండిలేకుండా

(ఇద్దరూ నడుస్తుంటారు. తెరవాలుతుంది.)

-(o)-

# బడిపంతులు

## రంగము

## 9

(స్థలము: పాఠశాల - రామయ్యాపంతులు - సుమతీశతకములోని పద్యాలు చదువుతూ వుంటాడు.)

రా :- అడిగిన జీతంబియ్యని, మిడిమేలపు దొరనుగొల్చి మిడు కుట కంటెన్ । వడిగల ఎద్దుల గట్టుక । మడిదున్నుక బ్రతుకవచ్చు మహిలో సుమతీ॥
అహాహా! ఏమి యీసుమతీ శతకములోని పద్యాలు. ఆ మహానుభావుడు ఎంత అనుభవంతో రాశాడు. శతకాలు చదివేవాళ్ళిప్పుడేరి? అందరి నీతిని అర్థంచేసు కునేవాళ్ళేరి? మనభాష, భక్తి, ముక్తి, నీతి అన్నీ మన శతకాల్లో నిండి వున్నాయి.

(ఇంతలో సుబ్బారావుపంతులు దర్జాగా ప్రవేశిస్తాడు.)

సు :- నమస్కారమండీ! (అనిప్రక్కకుర్చీలో కూర్చుంటాడు)

రా :- ఏమండీపంతులుగారూ! తమశలవు యీవేళతో పూర్తి అవుతుంది. వచ్చిస్కూల్లో జాయిన్ అవుతారా ?

సు :- నేను స్కూల్లో జాయిన్ అయితే, వూళ్లో పనులన్నీ ఎవరుచేస్తారండీ ?

రా :- ఎవరిపనులు వారే చేసుకుంటారు.

సు :- ఎవరిపనులువారే చేసుకుంటే, యీ సంఘాలూ, రాయ బారాలూ, నాయకులూ, వినాయకులూ, సర్వమూ ఏమైపోతాయండీ?

రా :- అవన్నీ మనకెందుకయ్యా !

సు :- పంతులుగారూ ? తమరు యింకా ద్వాపరయుగంలోనే వున్నారు. పాతకాలపు మాటలేతప్ప నవనాగరికతా వాసన తమకేమీ అబ్బలేదు. అందుకనే యీ అగచాట్లు చూడండి. ఊళ్ళో అయిందానికీ, కానిదానికీ, మనముందు నిలుచుంటే, మన వెంట పదిమందినడుస్తారు, వాళ్ళకు కప్పుకాఫీ పోయిస్తే సరి మనపేరు గోడల మీదికూడా అమాంతం పాకిపోతుంది.

రా :- గోడలమీద రాయించుకుంటె అవమానం కదండీ!

సు :- మనం రాయించుకునేవిఅలాంటివికావండీ. రేపుపంచాయతీబోర్డు మెంబరుగా నిలబడతాననుకోండి. అప్పుడు నాపేరు తాటికాయలంత అక్షరాలతో చక్కగాఅచ్చుకొట్టించి వాల్ పోష్టర్లు అంటిస్తారన్నమాట!

రా :- ఈ బడిపంతులుకు ఆదశకూడానా!

సు :- కలియుగంకూడా సమాప్తం అవుతున్నది. మనం బడిపంతులు అవతారం యెత్తుతున్నాము. దానికావలని ప్లానులన్నీ సిద్ధంచేసుకొన్నాను.

రాము: తమరు యిక బడిపంతులు పనిచెయ్యరన్నమాటే?

సు :- ముమ్మాటికీ చెయ్యను. చెయ్యవద్దనికూడా చెబుతాను,

రాము: అంతవిరక్తి కలిగిందేమండీ వుద్యోగంమీద?

సు :- పులిహోరా రావక పిండి వంటేనా! ఇదొక వుద్యోగం కావడానికి ?

రా :- అయితే తమరేంచెయ్యదల్చుకున్నారు!

సు :- ప్రజాసేవ. దాంతో స్వార్థం, తీర్థంఅన్నీకలిసివస్తయ్యి.

పేదలకు భూములిప్పిస్తామనీ, ఒకసంఘాన్ని ఏర్పాటు చేస్తాము. అంతేకాదు ప్రస్తుతం హరిజన సేవక్రింద అందరూ చలామణి అవుతున్నారు. హరిజన కాలనీలు, హరిజనహాస్టల్సు రకరకాలపేర్లతో పచ్చిమోసం చేస్తున్నారు. చందాలు, విరాళాలు గలగలారాల్చుకుంటూ వున్నారు. వాళ్ళందరికీ బుద్ధివచ్చేట్టు చెయ్యాలి. మన ప్రభావం పెరిగిపోవాలి.

రామ: మంచిమార్గమే ఆలోచించావు ధన్యుడివి.

సు :- అంతేనా. మంగలి షాపులకూ, ఇస్త్రీదుకాణాలకు. టీస్టాల్సుకూ, కిళ్లీకొట్లకూ, నన్నుప్రారంభోత్సవం జరపమని ఆహ్వానిస్తారు. ప్రతిరోజూ పేపర్లలో సుబ్బారావుపేరు మ్రోగిపోవాలి.

రామ: అదృష్టం అలా కలసిరావాలి.

సు :- భగవంతుడు పదిఅవతారాలెత్తాడని మనం పిల్లలకు బోధిస్తున్నాం. బుర్రలేనివాడుగనక యిదివరకే సగిపెట్టుకున్నాడు. ఈనాడురాజకీయంగా, ఒక్కొక్కరూ ఎన్ని అవతారాలెత్తుతున్నారో చూడండి.

రామ: తమరూ వకనాయకుడుగా అవతరిస్తారన్నమాటే!

సు :- నాయకుడేకాదు. చేర్మెన్‌గానో, ఎం. యల్. ఏ.గానో అతిత్వరలో అవతరిస్తాము.

రామ: పోనీనాయనా! నీవంటివాడైనా అధికారంలోకివస్తే మాబ్రతుకు బాగుపడుతుంది.

సు :- అంతాఅలాగేచేస్తామంటారు. లేదా ఆగద్దె యెక్కేప్పటికి లోకం మర్చిపోతారు.

ఆ :- అడుగో అప్పయ్యా వస్తున్నాడు. మనకష్టం విచారించి తగిన సహాయంల చేస్తాడు.

అప్ప :-ఆఁ. సహాయంచేయటాని కేరావటం. ఉన్నదికాస్త పూరి మీాదపెట్టి, అప్పయ్యా పూ రేగుతున్నాడు. కానీ తిరిగి రానంటుంది. ఇట్టా అయితే మేము కాశీకిపోవాల్సిందే.

రా :- కూర్చో అప్పయ్యా! వీరెవరూ?

అప్ప:-వీరా? కోర్టుఅమీనాగారు. మనపనిమీాదే వొచ్చారు.

రా :- మొన్ననే చెప్పాకదూ! తొందరపడవొద్దు, ఎలాగో తీర్చుకుంటామని.

అప్ప:-ఇంకాతీ రేదారి ఎక్కడుందయ్యా! అసలుసంగతి కూడా మాకు తెలిసిందిలే. నువ్వుదాచిపెడితే దాగుతుందా?

ఆ :- అదికాదు అప్పయ్యా! నిలవడానికి నీడలేకుండా చెయ్యోద్దు. నీకుపుణ్యంవుంటుంది. ఈ యింట్లోనేవుండి యీాయువారమన్నా ఎత్తుకొని నీబాకీ తీర్చుకుంటాం.

అమే :-అలావల్లకాదండీ! సర్కారువారి వుత్తరువులప్రకారం యీా యిల్లు అప్పయ్యాశెట్టిగారి స్వాధీనంచేసి మేం వెళ్లాలి. ఇవిగో స్వాధీనం ఆర్డర్లు. ( అని కాగితాలు చూపిస్తాడు. )

రా :- అప్పయ్యా! వ్యవహారం అంతా పూర్తిచేసుకొని వచ్చావన్నమాట.

అప్ప :-అబ్బే! అమీనా వొచ్చేవరకు నాకేం తెలీదండీ. అంతా ఆకోర్టువాళ్ళే చేశారు. బాకీకికాలదోషం తగలకుండా వకకాగితంముక్కమాత్రం మా పీడర్ గారిచేతకోర్టులో పడేయించా. అంతే. ఆపైన యింత జరుగుతుందని నాకుమాత్రం ఏం తెలుసు పంతులూ?

రా :- అసలే వుద్యోగంపోయి అఘోరిస్తుంటే, కొంపస్వాధీనం చేసుకోడానికి నువ్వు సిద్ధపడ్డావు. అసలు యీ వుద్యోగంలో చేరడం మొదటితప్పు. ఎల్లకాలం దాన్ని అంటిపెట్టుకొని వ్రేళ్ళాడడం రెండోతప్పు! బ్రతకలేని వాడు బడిపంతులు, అనేసామెత ఊరికే పుట్టిందా. అనుభవంమీద అన్నమాటె! ఇప్పుడు 'బ్రతకలేని బడి పంతులు' గామారింది. చాలీచాలని జీతాలతో కాలం గడుపుతూంటే, చివరకు ఆ ఉద్యోగంకాస్త వూడిపోయింది అప్పులుమాత్రం మిగిలివుంటాయి. భార్యాబిడ్డలతో బ్రతకలేక దేశాటన చెయ్యడమే దీనిపర్యవసానం.

అమె: ఏమండీ! పంతులుగారూ! మాకు ఆలస్యం అవుతుంది. ఈ కాగితం మీద సంతకం చేసి. మీ సామాను మీరు తీసికొని, మీ దారి మీరు చూచుకోండి.

ఆది: నిలుచున్నట్టుగా పొమ్మంటే ఎక్కడికి పోతామయ్యా! కొన్నాళ్ళు ఆగండి. తర్వాత చూస్తాం.

అమె: అమ్మా! ఇది కోర్టువారి ఉత్తరువు. ఒక్క క్షణంకూడా ఆగటానికి వీల్లేదు.

ఆది : మా యింటిమీద మీ పెత్తనమేమిటయ్యా!

అప్ప: అలా అనకండి అమ్మగారూ! కోర్టురూల్సు మీకు తెల్యాదండీ!

ఆది : (కోపంతో) అవును. అప్పులుపెట్టి కొంపలు గూల్చేవాళ్ళకు అన్ని రూల్సులు తెలుస్తాయి.

రామ: (విచారంగా) అప్పయ్యా! ఆడవాళ్ళమాటకేం గాని, ఇంత పని జరిగిస్తావని కలలోకూడా అనుకోలేదోయ్!

# బడిపంతులు

## రంగము

## 10

(స్థలము: రామయ్యపంతులు యిల్లు—భార్య ఆదిలక్ష్మమ్మ చిరిగిన బట్టలు కుట్టుకుంటూవుంటుంది. కొడుకు సాంబశివరావు చదువుకుంటూవుంటాడు.)

రా:— (జేబులోనించి కాగితంతీస్తూ) ఆఁ ఇదుగో! రానేవొచ్చింది శ్రీ ముఖం.

ఆది:— (తొందరపాటుతో) ఎక్కడినుంచండీ? అల్లుడుగారు రమ్మన్నారా? అమ్మాయికి నెలలట! ఆ విషయం కూడా రాశారా? ఆకాస్త చెంబుడు నీళ్ళుపోస్తే మన కోరిక తీరిపోతుంది. మనమడో మనమరాలో.......

రా.— అబ్బా నీగోలనీది. వొట్టి అయోమయం.

ఆది—: మనకు శుభవార్తలు రాసేది వాళ్ళేగా?

రా:— శుభవార్తకాదు. నానెత్తిన పిడుగువార్త.

ఆది:— (నోరునొక్కుకుంటూ) అయ్యో! అదేమిటండీ. అంత మాట!

రా:— అవును. అంతాపూర్తిగా వింటేగా? అశుభమో శుభమో, తెలియడానికి.

ఆది:— బాగావుంది. మీరు సొంతం చెప్పరాయె.

రా:— చెప్పిందాకా నిబ్బరం వుంటేకదూ! ఇదుగో చదువుతావిను. (కాగితం చదువుతారు)

“ శ్రీ శతఘంటం రామయ్యగారికి మీ సర్వీసు ఈరో

జుతో పూర్తి అయిపోయింది. ఛార్జి అసిస్టెంటుకు వప్పజెప్పి రిటైరు కావలసింది. ఇందునుగురించి మాఆఫీసుకు తిరుగుటపాలో తెలియ జెయ్యా వలసింది.”
విన్నావా ? శ్రీముఖం అంటే. ఈరోజుతో నావుద్యోగం సంపూర్ణం అయింది. మంగళహారతి పాడమన్నారు.

ఆది:- అయ్యో దేవుడా ! అనుకోకుండా నే ఎంతపని జరిగింది. ఇంకా కొన్నాళ్ళువుంచితే వాళ్ళ దేంపోయింది ?

రా:- అవి గవర్నమెంటువారి వృత్తర్వులు. అన్నీ అలాగే వుంటాయి మన చేతిలో పని కాదు.

ఆది:- అంతే ఇకమీరు చదువుచెప్పడానికి పనికి రారన్న మాటేగా !

రా:- ఆఁ. అన్నమాటే !

ఆది:- ఇక సంసారం సాగెదెలాగు? పెళ్ళిబాకీకూడా తీరక పోయిందే.

రా:- మన బాకీలతో, మన బాగోగులులతో వాళ్ళ కేంపని ? రూలు ప్రకారం కాగితాలు పంపుతుంటారు. వాటికి మనం బద్ధులంకావాలి.

ఆ :- ఉన్నవాళ్ళకూ లేనివాళ్ళకు వక్కటె రూలా? ఏంటి?

రా :- అదంతావిచారించేదెవరు? వయసుమళ్ళింది. కనక వెళ్ళిపోండి అంటారు.

ఆ :- వెళ్ళి ఏం తినాలసి?

రా :- అడుక్కొని తినాలని !

(ఇంతలో అప్పయ్యశెట్టి, అమీనాను వెంటబెట్టుకొని నిశ్శబ్దంగా వస్తాడు. )

రామ: చూస్తూవుంటే అలాగేజరుగుతోంది.

సు :- తిన్నగా అంటారేం ?

సీ॥ లాయరు మనుజుడే లావు కొమ్ములులేవు
మునసబెక్కడి మహా మునియొకాదు
జడ్జీకి వీపులింజాము రేదియు లేదు
కలెక్టరరికాల కన్ను లేదు
ప్రభువుల బొడ్డున మాణిక్యముండదు
నేటిప్రధాని త్రినేత్రుడగునె
అధ్యక్షుడెక్కడ అవతరింపగ లేదు
మంత్రులందున పెద్దమహిమగలదె॥

గీ॥ వీరలందరు బాల్యాన వీధిబడిలో
గురునిశుశ్రూష ప్రభావకరుణచేత
ఇంతవారైరికాని, వేరేమిలేదు
నేడునాతనికన్నెత్తి చూడబోరు
కనికరింపరు దారిద్ర్య కారణమున

కనుక వొట్టికబుర్లతో పొట్టనింపుకుంటూ దరిద్రాన్ని వరించడమే మన పంతుళ్ళపని దీపములో చమురు పొయ్యరు, ఆరిపోనియ్యరు, ఇదిమనబ్రతుకు.

రామ: మరోగతిలేక దీన్ని అంటిపెట్టుకో వలసిందేగాని, అవకాశమున్నంత వరకు, వొదిలించుకొని, మరోదారి చూచుకోవడమే మంచిది.

సు :- మనచేత మొట్టికాయలుతిని, గుంజీలుపెట్టినవాడు, కిళ్ళీకొట్టుపెట్టి, పెద్దమేడకట్టించాడు. రిక్షాలాగేవాడు రింగులు రిప్పువాచీ, పెట్టుతున్నాడు. కూరలు మోసే

కూలివాడు రోజూ మూడురూపాయలు సంపాదిస్తు న్నాడు. అంట్లుతోమే అచ్చమ్మ, కొడుకును బి. ఏ., చదివిస్తున్నది. మీపిల్లవాడ్ని ఏం చదివిస్తారో చెప్పండి.

రా :- మాచినగుడ్డ చాకలికి వెయ్యాలంటే మరొకటిలేదు. మనదీ ఒక బ్రతుకేనా?

సు :- అసలు మనకష్టాలు విచారించి సహాయంచేసే పుణ్యా త్ముడు ఎవ్వరూ యిక పుట్టబోరు. (జేబులోనించి కాగి తంతీసి) ఇదిగో ఈ రిజైనుకాగితం ఆఫీసుకు పంపండి (కాగితం రామయ్యపంతులు తీసికొంటాడు.)

రా :- అలాగే సంపిస్తాను.

సు :- ఈ రోజుతో నాకు సంకెళ్లు వదలడమేగాక, దరిద్రం కూడవొదిలింది. వెళ్ళివస్తా. శెలవు. (నమస్కరించును)

రా :- (కళ్లుతుడుచుకుంటూ) వెళ్ళిరానాయనా? ధన్యుడివి. (సుబ్బారావు వెళ్ళిపోవును తెర వాలుతుంది.)

-(౦)-

అప్ప: ఇందులో నా తప్పేముంది. పంతులుగారూ! కోర్టులో పడేసిన కాగితం ముక్క యింతపని చేస్తుందని నాకు మాత్రం తెలిసేడిసిందా? ఆ ప్లీడరు మంత్రమేదో గాని...

అమీ: అప్పయ్యగారూ! స్వాధీనం చేసుకోడానికి మీకేమైనా అభ్యంతరం వుందా?

అప్ప:-అయ్యా! అమీనాగారూ! వీరు మా గురువుగారు. పిల్లా మేకా సల్లంగావుండారు. వెళ్ళగొట్టి యిల్లుతీసుకోడం ఎట్టాగా అని సందేహం. ఈ పనిచెయ్యడానికి చేతులు వొణుకుతున్నయ్యి. అయినా నేను ఊరుకుంటేమట్టుకు మీకోర్టువాళ్లు వూరుకుంటారా? రూల్సుప్రకారం నడుస్తారు.

అమీ: అవునండీ యిదుగో ఈ ఆర్డరుప్రకారం యీ యిల్లు స్వాధీనంకావాలి. అలాచెయ్యకుంటె కోర్టువారివుత్తరువులు ధిక్కరించిన నేరం మోపవలసివస్తుంది.

అప్ప:-అమ్మయ్యో! అంతపనే. అసలెయిల్లు వాకిలిలేకుంటా అవస్త పడుతుంటె, మాపంతులుగార్ని అలాంటి నేరం మోపి యింకా బాధపడుతుంటె చూస్తూ వుండడం నాకుమంచిదికాదు.

రా:- అమీనాగారూ! లేడికంట నీరుపెడితె వేటకాడు బాణం విడవకుండావుంటాడా! తమరువొచ్చిన పని నెరవేర్చుకోండి. ఏ రూల్సువచ్చినా పేదలనెత్తిన పిడుగే. ఆర్డరు కాగితం యివ్వండి.

(అమీనా కాగితంయిస్తే-రామయ్యపంతులు సంతకం చేసి తిరిగి యిస్తాడు.)

అమీ:-అప్పయ్యగారూ! ఈ నిమిషంనుంచి శతఘంటం రామయ్యపంతులుగారియిల్లు మీకు దఖలు పడిందన్నమాట. ఇక మీ యిష్టం.

అప్ప :-ఆఁ. ఇందులో నా యిష్టమేముంది. అంతా మీ కోర్టువాళ్ళ యిష్టప్రకారమే జరిగింది. పాపం. మా గురువుగారిమీద నాకు భక్తి లేదనా? యీదవ రూల్సులూ, ఆర్డర్లూ యివి అడ్డంవచ్చి కూచున్నాయి. లేకపోతే అన్యాయంగా యీ యింటిమీద ఆశనాకెందుకు? పంతులుగారూ! అంతా ఆ భగవంతుని దయ. ఏ రోజుకు ఏ గంగతాగాలో మనకేం తెలుస్తుంది.

రా :- అవునునాయనా! నిన్ను అనేం ప్రయోజనం. గురుభక్తి, గురువుయొక్క ఆశీర్వచనం, అన్నీ మంటకలిసి, తిన్న యింటివాసాలు లెక్కపెట్టే యీరోజుల్లో ఇలా జరగడంసహజమే.

అమీ:-కాలమే మారిందిలెండి పంతులుగారూ!

అప్ప:- అదీ సిసలైనమాట. వెళ్లివస్తాను పంతులుగారూ! సాయంత్రానికి అన్నీసర్దుకొని, యిదుగో యీతాళము యింటికి భద్రంగా వెయ్యండి (అని జేబులో తాళము తీసి యిస్తాడు.)

రామ: అప్పయ్య గురుభక్తికి యిదే నిదర్శనం. (అని తాళం అందరికీ చూపిస్తాడు.)

ఆది అప్పయ్యా! గురుద్రోహం చేస్తావా?

అప్ప: ద్రోహమేముంది? అమ్మగారూ! అదంతా మన కర్మ లెండి. పంతులుగారూ! సాయంత్రం మర్చిపోకండి. తాళం యింటికి పట్టుకొచ్చి...ఆఁ. అంత శ్రమ ఎందుకులెండి? నేనే వచ్చి పట్టికెళ్ళతాను. మర్చిపోకండి.

రామ: చిత్తం. అలాగే.

అప్ప: రామయ్యా! అమీనా! ఎంత పని చేశాడు.

(అంటూ యిద్దరూ నడుస్తారు. తెరవాలుతుంది.)

---

# బడిపంతులు

## రంగము

## 11

(ప్రవేశము - రామయ్యపంతులు చేతిలో సితారావుంటుంది. భార్య ఆసి లక్ష్మమ్మ చేతిలో గుడ్డలమూట వుంటుంది. కొడుకు సాంబశివరావు చేతిలో చెంబు పట్టుకొంటాడు.)

రాము:(ప్రేక్షకులతో) ఎంత విజ్ఞానవంతుడైనా దరిద్రం చేత రాణించడు. విద్యావంతుడు, కూటికీ, గుడ్డకూ, లేక దేబెరగొట్టు మొహంతో కలవారిని పారజూస్తుంటాడు ధనికుడు, ఇనపపెట్టెలో మూలుగుతున్న ధనంతో బాటు అజీర్ణరోగంతో మూలుగుతుంటాడు. కులలోపమునాక గుణలోపమున్నా, కనబడకుండా చెయ్యగలిగిన దా ధనము. ధనమే సర్వశక్తులకు మూలం అట్టి ధనలోకాన్ని కలిగించే, ఈ బడిపంతులు ఉద్యోగాన్ని అంటిపెట్టుకుని, నెలపొడుగునా, ప్రతివాడినీ, యాచించడం, బ్రతికివుండగా ప్రాణాలు తీసుకోవడమే అవుతుంది.)

(ఇంతలో—సుబ్బారావు—చలమయ్య వస్తారు.)

సు :- (ఆశ్చర్యంతో) రామయ్యగారూ! ఏమిటీ వేషం. ఎందుకిలా బైలుదేరారు? జరిగిన సంగతంతా తెలుసుకున్నాం. ఏదోవక మార్గాన్ని ఆలోచిద్దామని వచ్చాం.

రా:- ఇంకా ఆలోచన ఏముంది. నా జీవితం మిగతా పంతుళ్ళకు చక్కని గుణపాఠం నేర్పింది. యాత్రలు సేవిస్తూ మిగతా కాలాన్ని సద్వినియోగం చేసుకుంటాము.

చల:- ఆదాయానికిమించిన బాధ్యలతో, బ్రతుకే భారమైన యీబడిపంతుళ్ళకు, చివరకు యింతకంటె మిగిలే దేముంది ?

సు :- ఒక్క కుటుంబంలో వుండే నలుగురు పిల్లల్ని సవరించుకో డానికి, తల్లిదండ్రులు ఆయాసం, శ్రమ, పడవలసి వుంటుంది. అనేకమంది బాలికలను సరిదిద్దకొని, వాళ్ళ లేతహృదయాలను అర్థంచేసుకొని, అక్షరజ్ఞానం కలిగించాలంటే ఎంతవోర్పూ, నేర్పుతనం వుండాలో ఆలోచించండి.

చల;- మీబిడ్డల్ని తీర్చిదిద్ది, సద్వర్తునులుగా, భావిభారత పౌరులుగా, దేశౌన్నత్యానికి పెట్టనికోటలుగా, తయారు చేయవలసినశక్తి సామర్థ్యాలు, యీప్రాథమికోపాధ్యాయునికున్నాయి. అలాంటి వుపాధ్యాయుడు. అనుక్షణం ఎన్నో బాధలకు, అనర్థకాలకు, ఆర్థికచింతకు గురిఅవుతున్నాడు. ఏ బాదరబందీలేక, నిర్మల వాతావరణం కలిగి, సుఖవంతమైనజీవితం గడపడానికి తగినఅవకాశం ఉపాధ్యాయునికికలిగించాలి. ఆనాడే, ఈయుపాధ్యాయునిలోవుండే మహత్తరశక్తి విజృంభించి, అఖండ మేధావులైన విద్యార్థులనుతయారుచెయ్యగలడు కష్టాలతో అణగారిపోయే వుపాధ్యాయుడు, దేశంలో వున్నంతకాలం, మనవిజ్ఞానం. జాతీయత పునాదుల్లేక ఊగిసలాడుతూ , అభివృద్ధిని పొందడానికి మారుగా, పతనం అవుతాయంటే నమ్మండి. అందుకు ఈ రామయ్య పంతులుగారి జీవితమే నిదర్శనం.

రా :- నాయనలారా ! మనకు అకాలమవుతున్నది. ఇక సెలవు పుచ్చుకుంటాము.

(తంబుర మీటుతూ పాటపాడును.)

ఎందుకీ బడి పంతులోయన్నా
నీకెట్టిసౌఖ్యము దీనియందున కలుగబోదన్నా॥
ముప్పదియేడులు సేవజేసిన
అప్పవారల ముప్పదప్పుడు
చెప్పరాని బాధలెన్నో
తప్పకోవలె దీనినుండి
ఎందుకీ బడిపంతులోయన్నా
నీకెట్టిసౌఖ్యము దీనియందున కలుగబోదన్నా॥
పట్టుమని పదిరోజులైనను
గిట్టుబాటగు వృత్తి గాదిది
చిట్టచివరకు వట్టిచేతుల
పొట్ట బట్టుక కైలు దేరెను
ఎందుకీ బడి పంతులోయన్నా
నీకెట్టి సౌఖ్యము దీనియందున కలుగబోదన్నా॥

దేశదేశాలవారికి — జ్ఞానభిక్ష ప్రసాదించిన
ఈ భారతదేశపు బడిపంతులు —
ఆకలిమంటకు ఆహుతియై
అక్షయపాత్రను పట్టాడోయ్!
బిచ్చము పెట్టగ రారండోయ్ —
కళాకారులను, శాస్త్రవేత్తలను

# బ డి ప ం తు లు

శాంతిదూతలను దిద్ది తీర్చెడి
బడిపంతులుస్థితి బాగుపడాలోయ్ ||
వీరశివాజీ, సుభాసుబోసు
బాలచంద్రుడు, వివేకానందుడు
వేలకువేలై వెలయాలంటే
బడిపంతులు స్థితిబాగుపడాలోయ్ -
భావిపౌరులౌ బాలబాలికలు
శూరపురుషులై వీరమాతలై
దేశస్వాతంత్ర్యం నిల్పాలంటే
బడిపంతులు స్థితి బాగుపడాలోయ్.